యుగసంఖ్యలనుబట్టియు జరిగిన యుగాలను కనుగొంటిమి. సూర్యసిద్ధాంతములో చెప్పబడినరీతిగా అశ్వినీవిషువత్తు పరిభ్రమణము క్రీ. పూ. సావన సం॥ల రీత్యా 7260 సం॥ల క్రిందట నున్నట్లును, అదియే ఋగ్వేదమున నొకచోట నుదాహరింపబడియుండుననియు గ్రహించితిమి. స్వాయంభువు అనగా మనదేశములో మొట్టమొదటి పురుషుడు. క్రీ. పూ. 7838 సం॥ల వాడనియు, నాతని తర్వాతనే పైన నుడివిన ఋగ్వేదమం దుదాహరింపబడిన విషువత్తు వచ్చియున్నట్లును గ్రహించితిమి. యుగాద్యంతముల తిథులనుగూడ గమనించి యవి సావన సం॥లచే నిర్మింపబడిన 1200 సం॥ల పరిమాణయుగాలని గ్రహించితిమి. మృగశిరలో విషువత్తు ఉన్నట్లు గల ఋగ్వేదసూక్తులనుబట్టి ఆకాలము B C. 4500 నాటిదని లోకమాన్య తిలకుగూడ వ్రాసియున్నాడు. తైత్తిరీయమున బృహస్పతి తిష్యానక్షత్ర సన్నిధి నున్నట్లు గలదానినిబట్టి యా కాలము B.C. 4650 ప్రాంతమగునని వి. బి. కేట్కారు పండితుడు నుడివెను. ఇవిగూడ మన నిర్ణయములకు విరుద్ధముగ లేవు.

నిజస్థితి యీవిధముగా రుజువగుచుండగా మన గణితశాస్త్రజ్ఞులు కేవలము గ్రుడ్డిగా నొక్కొక్క శాస్త్రమునే ఆధారముగాగొని, విమర్శనాదృష్టితో యితర ప్రమాణగ్రంథములనుగాని, యితరదేశ శాస్త్రములనుగాని పరిశీలించి సత్యమును గ్రహింపక పూర్వపుపక్కీనే వేలకొలది సం॥లు పూర్వరాజులు జీవించినట్లు వ్రాయుచున్నారు. ఒకపంచాంగకర్త యీ క్రింది కాలములు తన పంచాంగమునందు వ్రాయుట యెంత అసంబద్ధమో చూడుడు.

ఈయన వ్రాసినప్రకారము

| | | | |
|---|---|---|---|
| బలిబంధనాబ్దములు | 1951889040 | సం॥లు | అయినట్లు |
| హరిశ్చంద్రమహారాజు | 23820182 | ,, | ,, |
| నలమహారాజు | 13623889 | ,, | ,, |
| కార్తవీర్యాబ్దములు | 12835040 | ,, | ,, |
| రావణాబ్దములు | 12569040 | ,, | ,, |
| శ్రీరామ రాజ్యాంతవత్సరము | 12558040 | ,, | ,, |
| భరతాబ్దములు | 5088 | ,, | ,, |
| పాండవాబ్దములు | 5040 | ,, | ,, |



ఇట్టివారికి పురాణములవంటి వ్రాతలుగూడ అక్కరలేదు. వారి కభిమాన గ్రంథమగు సూర్యసిద్ధాంతవ్రాతలో, మరేసిద్ధాంతపువ్రాతలోగాని యితర ప్రపంచవిజ్ఞాన మక్కరలేదు. ఇట్టి యజ్ఞానపూరిత గణితములను సాగనిచ్చినచో మన దేశమున వాస్తవిక జ్ఞానము వృద్ధియగుట కల్ల. అందువల్ల ప్రభుత్వమువారు గూడ జోక్యము కల్గించుకొని నిజమారసి, పంచాంగములందు వాస్తవికజ్ఞానము నభివృద్ధిపరచుటకై తోడ్పడునట్లు కట్టుబాట్లు చేయదగియున్నది. ఇక్ష్వాకు మొదలుకొని పాండవులకాలము వరకు 88 తరములే ఇక్ష్వాకువంశములో నుండెనని లోగడ తెలిపితిమిగదా! అవి గమనింపక కేవలము సృష్ట్యాది సం॥లు నిర్ణయించుటకై వారల పేరిట యేర్పరచబడిన కాలములన్నియు వారి జీవితకాలములుగా నమ్మి దేవమానములను మనుష్య జీవితమానములుగా దలంచి వేయు యీతప్పులెక్కలవల్ల దేశములో నజ్ఞానము నశింపదని వేరుగ చెప్పనక్కరలేదు.

## దేవమాన మెందుకు త్రోసివేయవలెను?

స్వాయంభువు మొదలు దేవతార్యులందరు మనదేశమునందే వసించిరిగాని ధ్రువమండలప్రాంతమున గాదని మున్ముందు వ్రాయు విషయముల వల్ల దెలియగలదు. ధ్రువమండలములో తమ పూర్వులు నివసించిన ట్లార్యులొక్కచోటమాత్రము ఋగ్వేదములో చెప్పియుండినను ఆ కాలపువారి పేర్లేమియు నుదహరింపలేదు. అచటినుండి క్రమముగా వచ్చినపిమ్మట నిరాను ప్రాంతములో చాలకాలముండిన పిమ్మటనే యీ భూమికి వచ్చిరి. ఆ కాలమెంత జరిగెనో యెచ్చటను చెప్పబడలేదు. మన దేశమునకు వచ్చిననాటి నుండి సూర్యోదయాస్తమయములు నిత్యము జరుగుచునేయుండెను గాని ధ్రువమండలపద్ధతి గాదు. అందుచే నీ దేశమునబుట్టి పెరిగి చనిపోయిన వారందరిని దేవమాన సం॥ల రీత్యా లెక్కలుకట్టి పురాణములలో వర్ణించుట కేవలము తప్పుగానున్నది. వాని ననుసరించియే పై లెక్కలు చూపబడినట్లు వేరుగ చెప్పనక్కరలేదు. మనుస్మృతి ప్రకారము జీవితము 400 సం॥లుగా చూచినప్పుడు దేవమానము కల్పితముగా రుజువగుచున్నది. ఇచటనే పూర్వమునుండి యుండిరన్నను, దేవమానములో పనిలేదు.